## ప్లానింగు డిపార్టుమెంటు రద్దు
### జాతీయ ప్లానింగు కమిటీ అధిక్షేపణ

బొంబాయి, జూలై 9: యుద్ధానంతర నిర్మాణ కార్యవిధానమునకు ప్రణాళికలను తయారుచేయుటకై ప్లానింగు డిపార్టుమెంటు ఏర్పాటు చేయబడెను. వైస్రాయి కార్యనిర్వాహక సభ్యులందరు రాజీనామా నిచ్చినందున క్రొత్త తాత్కాలిక ప్రభుత్వవర్గం ఏర్పడేవరకు యిప్పుడు వ్యవహరిస్తున్న నడుమంత్రపు ప్రభుత్వవర్గము వారు యీ ప్లానింగు డిపార్టుమెంటును రద్దుచేశారు.

పండిత నెహ్రూగారి అధ్యక్షతన ఏర్పాటు కాబడిన నేషనలు ప్లానింగు కమిటీ నేడు బొంబాయిలో నెహ్రూగారి అధ్యక్షతను సమావేశమై సదరు ప్లానింగు డిపార్టుమెంటును రద్దుచేయుట అక్రమమని అధిక్షేపిస్తూ యీ క్రింది రీతిగా తీర్మానము చేసెను.

ప్లానింగు డిపార్టుమెంటును రద్దుచేయటం చూడగా, దేశముయొక్క అభ్యుదయమునకై క్రొత్త ప్లానులను తయారుచేసే డిపార్టుమెంటు అముఖ్యమైనదని ప్రభుత్వము భావించుచున్నట్లుగానున్నది. ఆయా రాష్ట్రములు ఏకముఖ్యంగా దేశాభ్యుదయ దాయకమైన స్కీములను కలిసి వ్యవహరించునట్లుగా చేయుటకు ప్లానింగు డిపార్టుమెంటు ఉండాలి. అనేక లెక్కవివరములను సేకరించుటకు కూడా యీ డిపార్టుమెంటు అవసరం. కాబట్టి ఈ డిపార్టుమెంటును రద్దుచేయడం చాల పెద్ద పొరబాటు.

ఆహారము విద్య, గృహవసతుల

ప్రజలకు ఆహారవసతులు సమకూర్చుటకును, విద్యాభివృద్ధికొరకును గృహవసతులను కల్పించుటకొరకును కొన్ని స్కీములను నేషనలు ప్లానింగు కమిటీ తాలూకు సబ్‌కమిటీలు తయారుచేసెను. ఈ నివేదికలు రాష్ట్రీయ ప్రభుత్వాలు వెంటనే అనుసరించి అమలుజరుపుటకై ప్రకటింపబడును.

## ధర్మవరం తాలూకాలో పశువుల పాట్లు

ధర్మవరము, జూలై 4: ఈ తాలూకాలో కనగానిపల్లె, రామగిరి, మేడాపురము ఫిర్కాలలో మేతకఱవు దినదినాభివృద్ధిగాంచుచున్నది. పశువుల దుస్థితి చెప్పతీరనిదిగానున్నది. ఆ ప్రాంతములలో బావులలో నీళ్లులేవు. పశువులకు గడ్డిలేదు. కుంటలకు కడుపునిండ నీరు త్రాగుటకు కూడ వానకనుకూలములేదు. పొలములలో గడ్డియాకు మంటెని నాకిపోవుచుండుటచే పశువులు చనిపోవుచున్నవి. ఇంతవరకు వచ్చిన వార్తలబట్టి క్రొత్తగాదిగకుంట, రామగిరి, కొసనకోటలలో వరుసగా 27,100,100 పశువులు పోయినవి. పశుపుపశువులు కూడ పోవుచుండుటచేత రైతులు దిక్కుతోచకున్నారు. మొన్న ఈ విషయమును శ్రీ పల్లెము శ్రీనివాసులు, ఏ. ముత్యాలప్పగారలు ఇచటి తహసీల్దారుతో మాటలాడి కనగానిపల్లె రామగిరులలో గడ్డిడిపోలు ఏర్పాటుచేయవలెనని కోరగా వారు ఈ సంగతి కలెక్టరుకు తెలిపి తగు చర్యతీసికొందుమనియు, ప్రకృతము ధర్మవరము, చెన్నే కొత్తపల్లెలలో గడ్డిడిపోలు పెట్టెదమనియు తెల్పిరి.

## తిరుపతి దేవస్థానం ఎస్టేటు: రైతు మహాసభ

తిరుత్తని, జూలై 6: తిరుపతి దేవస్థానం ఎస్టేట్ తిరుత్తని, పుత్తూరు, కర్వేటినగరం, పల్లిపట్టు తాలూకాల జమీన్ రైతు మహాసభ నిన్న తిరుత్తనిలో జయప్రదముగ జరిగినది. మదరాసు ప్రభుత్వ పార్లమెంటరీ కార్యదర్శియైన శ్రీ వెన్నెలకంటి రాఘవయ్యగారు అధ్యక్షత వహించిరి. భారతి శాసనసభాసభ్యులను శ్రీ మాడభూషి అనంతశయనం అయ్యంగారు మహాసభను ప్రారంభించిరి. అన్ని తాలూకాలనుండియు సుమారు వేయిమంది ప్రతినిధులు సభకు వచ్చియుండిరి. సభకు వచ్చిన ప్రతినిధులందరకు శ్రీ దావులూరు మునిరత్నంనాయుడు, శ్రీ పసల గోపాల రెడ్డిగారలు స్వాగతమొసగి ఆహ్వానించిరి.

ప్రప్రథమమున సంటూరువాస్తవ్యులకు శ్రీకోసరాజు రాఘవయ్యచౌదరిగారి ప్రబోధగీతములతో సభ ఉపక్రమింపబడినది. శ్రీ మాడభూషి అనంతశయనమయ్యంగారు జమీన్ రైతుల హక్కు భుక్తములకై రైతులందరు ఏకముఖముగ పనిచేయవలసిన అవసరమును వివరించిరి.

తిరువాతి అధ్యక్షులు రైతులకుచక్కని ఉపన్యాస గావించిరి. జమీన్ రైతుచట్టము నుత్వరలో ప్రవేశపెట్టుటకు కాంగ్రెసు మంత్రులు సన్నాహములు చేయుచున్నారనియు, గౌ॥ ప్రధాన మంత్రి శ్రీ ప్రకాశంపంతులుగారు జమీన్ రైతుల సుదరించుటకు కంకణము గట్టి కాంగ్రెసు ప్రణాళికలో సూచింపబడిన సిద్ధాంతములను అమలు జరుపుటకు దృఢసంకల్పులై యున్నారనియు, ఎన్నికలలో కాంగ్రెసును గెల్పించినందులకు రైతులోకము మహదానందమునందు సభదినములు వచ్చినవనియు, వెనకటివలె ప్రజలు అధికారుల దౌర్జన్యములకు లొంగియుండవలసిన దుస్థితి తొలగిపోయినదనియు, రైతులు తమ కష్టములను యెప్పటికప్పుడు తెలిపిన విని తగిన చర్యచేసికొనుటకు మంత్రులు సిద్ధముగనున్నారనియు, ఈ అవకాశము నుపయోగించుకొని దేవస్థానపు అధికారుల నిరంకుశ చర్యలను అరికట్ట సుఖపడవలెనని యు, ఆహార సమస్యలలో గాని, మద్యపాన నిషేధ కార్యక్రమమునందు గాని రైతాంగ మంతయు కాంగ్రెసు విధానమును బలపరచవలెననియు ప్రబోధించిరి.

## ప్రజాప్రతినిధి పరిషత్తు జయప్రద మగును
### శ్రీ సి. రాజగోపాలాచారిగారి జోస్యము

బొంబయి, జూలై 9: "ప్రజా ప్రతినిధి పరిషత్తు రెండుసెలలపాటు జరుగవచ్చును లేదా రెండు సంవత్సరములపాటు జరుగవచ్చును. కాని ఉత్తరోత్తరా అది జయప్రదముకాకతప్పదు. వ్యవహారము సక్రమముగా కొనసాగించి ఒక రాజ్యాంగవిధానమును మనము నిర్మించుకొనగలమని నిశ్చయముగా చెప్పగలను" అని నూతన కాంగ్రెస్ కార్యవర్గసభలో సభ్యుడను శ్రీ సి. రాజగోపాలాచారిగారు నుతంగా సభలో ఉపన్యసించుచు చెప్పిరి.

నాల్గు సంవత్సరముల క్రిందట మతంగా ప్రజలు ఆచారిగారి రాజకీయాభిప్రాయములను సహింపజాలనివారై, ఆగ్రహోద్రిక్తులై ఆచారిగారిని అడ్డుప్రశ్నలతో వేధించి, గలిచేసి, అఖరుకు ఆయనవంటి నిండతారు పులిమి యుండిరి. ఇట్టి ప్రజలు నేడు నాయకునకు ఉత్సాహపూరితమను ఆహ్వాన మొసంగిరి.

"మనమందరము ఈ దేశాభివృద్ధికి కృషి చేయవలెను. నికరమైన, నిజమైన స్వాతంత్ర్యము చేకూరువరకు ఈ జేకశ్రమ మునకై మనముపాటుబడెదము. రాజ్యాంగ పరిషత్తులో ఎన్ని తగాదాలు వచ్చినను, ఎన్ని అవక్రతులు బయలుదేరినను మనము వ్యవహారం సాగించి ఒక రాజ్యాంగ విధానమును నిర్మించెదము ఒక రాజ్యాంగ విధానమును మనము నిర్మించెదమని నిశ్చయముగా చెప్పుచున్నాను, ఎందువల్లననగా మనతో కలహించి బ్రిటను విడిగి వేసారి యున్నది. ఐనప్పటికి వారు పెనసులాడి, పట్టుబట్టి అనేక విషయములపై తగిన సంధి చేసికొనెదరు. అంతరంగిక మత విషయములలో మనము ఒడంబడికకు వచ్చుట సులభము కాకుండెను, కాని బ్రిటిషువారితో ఒడంబడికకు వచ్చుట అంతకంటె యెక్కువ సులభముగా నుండవచ్చును. ఎందువల్లననగా, బ్రిటిషు వారు అనుభవజ్ఞులు. కార్యవాదులు. మనవలె కేవలము సిద్ధాంతములనుగూర్చి మాట్లాడువారు కారు.

కేవలము రాజ్యాంగవిధానమును నిర్మించినంతమాత్రమున మనకు స్వాతంత్ర్యము రాదు. ఆ రాజ్యాంగవిధానమును సమర్థముగా అమలుచేయుటవల్లనే మనకు స్వాతంత్ర్యము చేకూరును" అని ఆచారిగారనిరి.

ఆచారిగారు ద. ఆఫ్రికా భారతీయుల దుస్థితిని సింహళ భారతీయుల దుస్థితిని సామ్యము చూపి భారతీయులను బాధించుటలో సింహళము ద. ఆఫ్రికాను తలదన్ని పోవుచున్నదనిరి 'సింహళము మనకు చాలాదగ్గరగానున్నది. ఒక్క గంతువేసి మనము ఆద్వీపమునకు వెళ్లవచ్చును. పూర్వము ఒకడు గంతువేసి ఆద్వీపమునకు వెళ్లెను గూడను తాము భిన్నజాతిప్రజలని సింహళ ప్రజలు తలచుచున్నారు. కాని అన్నమునకై అల్లాడునప్పుడు 'మనమంతా ఒకటే, మాకు బియ్యము పంపుడు' అని భారతదేశమును వారు అర్థించెదరు' అని ఆచారిగారనిరి. అ. ప్రె.

### రాయలసీమ కాలేజీలు

రాయలసీమలోనున్న కాలేజీలన్నీ ఆంధ్రవిశ్వ విద్యాలయంలో చేర్చుటకు వీలుగ ఆంధ్రవిశ్వ విద్యాలయ చట్టం సవరించాలని ఒక తీర్మానమును మదరాసు కాంగ్రెసు లెజిస్లేటివు పార్టీయందు ప్రతిపాదించుటకు ఒక రాయలసీమ శాసన సభ్యుడు నోటీసు యిచ్చిరి.

### దత్తమండల కళాశాలలలో విద్యార్థులకు పునః ప్రవేశం

అనంతాపురం, జూలై 7: ప్రవేశమిచ్చినట్లే ఇచ్చి, తిరిగి, జా అలజీ శాఖకు ఉపన్యాసకుడు లేడనే కారణంతో ప్రవేశం నిరాకరింపబడిన 30 మంది విద్యార్థులు ఆ దరిమిలాను పురప్రముఖులును, విద్యార్థులును జరిపిన ఆందోళన ఫలితంగా యథావిధిగా జూనియర్ ఇంటర్మీడియేటు తరగతిలో మరల చేర్చుకోబడినారు.

## సెడ్యూల్డు తరగతుల సత్యాగ్రహం
### ప్రశ్నలకు స్పష్టమైన ప్రత్యుత్తరములు కావలెనను కోర్కె

పూనా, జూలై 9: సెడ్యూల్డు తరగతుల ఫెడరేషనువారి రాయబారమునకు పర్యవసానంగ యిటీవల గాంధిమహాత్ముడు వాగ్దానము గావించి యుండెను. ఈ వాగ్దానమును పాల్గొంచని డెమిల సదరు సెడ్యూల్డు తరగతుల ఫెడరేషను అనుయాయులు తమ నాయకులను కిక్కెవాడ్, రాజ్‌భోజ్‌గారల నాయకత్వమున పూనాయందలి మహాత్ముని బసవద్దకువెళ్లి అచ్చట సత్యాగ్రహము చేసెదరు. ఏ. ఐ. సి. సి. సభ సమయమున తాము పంపిన ప్రశ్నలకు విస్పష్టమైన సమాధానములు కావలెనని సదరు ఫెడరేషనువారు కోరుచున్నారు.

'ఈ ప్రశ్నలు సెడ్యూల్డు తరగతుల భవిష్యత్తుకు ప్రాణతుల్యమైనవి. ఈ ప్రశ్నలకు మహాత్ముడు సూటిగా సమాధానము లివ్వవలెను', అని సెడ్యూల్డు తరగతుల నాయకుడు రాజ్‌భోజ్‌గారు ఒక ప్రకటనలో, చెప్పుచున్నాడు.

వారు పంపిన 9 ప్రశ్నలలో ముఖ్యమయినవివి.

(1) భారతదేశములో నిజమైన మైనారటీ ఒక్క అస్పృశ్యులు మాత్రమేనని గాంధిజీ 1939 సంవత్సరమున హరిజన వ్యాసములో చెప్పియుండెను. అట్టి సందర్భమున అస్పృశ్యులను మైనారటీగా అంగీకరింప కాంగ్రెసు సిద్ధముగా లేదని మౌలానా అజాదు రాజప్రతినిధికి వ్రాసిన లేఖలో యెందుకు చెప్పెను? ప్రస్తుత ఇండియా ప్రభుత్వశాసనములో అస్పృశ్యులకుగల రాజకీయ రక్షణలను సైతము కాంగ్రెసువారు తొలగించెదరని దీనికి అర్థమా?

(2) ఒకానొక సంఘముయొక్క మతమునకును ప్రత్యేక నియోజకవర్గములకై వారు కోరుకోర్కెకును సంబంధమేమియు లేదు. ఒక మతము నవలంబించుచున్న యూరోపియులకు ఆంగ్లో - ఇండియనులకు భారత క్రిస్టవులకు ప్రత్యేక నియోజకవర్గములున్నవి. కాంగ్రెస్ సైతము దానిని ఆక్షేపించియుండలేదు. ఇట్టి సందర్భమున సవర్ణుల మరియు అస్పృశ్యుల మరియు ఒక్కటేయను కారణమున ప్రత్యేకనియోజకవర్గములు కావలెనని అస్పృశ్యులు కోరుచున్న కోర్కెను కాంగ్రెసు యెందుకు ప్రతిఘటించుచున్నది? అ. ప్రె.

## గాంధీజీ కార్యక్రమం

పూనా, జూలై 9: అఖిలభారత కాంగ్రెసు సంఘసమావేశానంతరం బొంబాయినుండి నేడు మహాత్మా గాంధీ పూనాకు విచ్చేశారు: శివాజీ స్టేషనువద్ద దిగి ప్రకృతి చికిత్సా శ్రమంలో బసచేయడానికై. ఒక మైలు నడిచి వెళ్లారు.

కస్తూరిబాయి గాంధీ జాతీయ జ్ఞాపక నిధి కార్యకర్త సమావేశానికి గాంధీజీ రేపు అధ్యక్షత వహిస్తాడు. కస్తూరిబాయి నిధికి నిర్మాణ కార్యదర్శియైన శ్రీమతి సుచేతా క్రిపాలనీగారు యీ సమావేశమునకు హాజరవుటకై నేడు విచ్చేశారు.

## జులై 28, 29 తేదీలలో ముస్లింలీగ్ కౌన్సిలుసభ

న్యూఢిల్లీ, జూలై 9: అఖిల భారత ముస్లింలీగ్ కౌన్సిలు సమావేశాన్ని బొంబైలో జులై 28, 29-వ తేదీలలో జరపడానికి నిర్ణయించినట్లు లీగ్ గౌరవ కార్యదర్శి నవాబ్జాదా లియాకత్ ఆలీఖాన్ గారు ప్రకటిస్తున్నారు. తాత్కాలిక కేంద్ర ప్రభుత్వ స్థాపన విషయమై వైస్రాయి ప్రవర్తనను గురించి చర్చిస్తారట. లీగు కార్యవర్గసభ కూడా బొంబైలోనే జులై 27 న జరుగుతుంది.

## శాంతిసమావేశము ఆహ్వానపత్రం

పారిసు, జూలై 9: 21 రాజ్యాల శాంతి సమావేశం సందర్భంలో ఆ యా రాజ్యాలకు ఫ్రాన్సు పంపిన ఆహ్వానము ఇట్లా వున్నది:—

"విదేశాంగ మంత్రుల సంఘము తరపున, 1946 జూలై 4 న సదరు సంఘము చేసిన నిర్ణయానుసారం. ఫ్రెంచి ప్రభుత్వము......దేశ ప్రభుత్వాన్ని, ఇటలీ, రుమేనియా, బల్గేరియా, హంగేరీ, ఫిన్లాండులతో శాంతి ఒడంబడికలు వ్రాసుకొనడములో పాల్గొనవలసినదని, 1946 జూలై 29 న లగ్జెంబర్గు ప్రాసాదంలో ప్రారంభం కానున్న సమావేశానికి ప్రతినిధులవర్గాన్ని పంపవలసినదని సగౌరవంగా ఆహ్వానిస్తున్నది.

ఇటలీ, రుమేనియా, బల్గేరియా, హంగేరీ, ఫిన్‌లాండులతో చేసుకోవలసిన శాంతి ఒడంబడికల విషయములో విదేశాంగ మంత్రుల సంఘం తయారుచేసిన ముసాయిదాలను వీలైనంత తొందరలో......ప్రభుత్వాలకు అందచేయనగును.

ప్రతినిధుల సౌకర్యార్థం, వారికి సూచించ వలసిన సమావేశం ఏర్పాటుకు సంబంధించిన ప్రతిపాదనలనూ, కార్యక్రమ నిబంధనలనూ పారిస్‌లో...రాయబారి లేక ప్రతినిధి కార్యాలయంలో అందచేయడమవును.

## ఇంకో పదేళ్లలో మళ్లీ యుద్ధం
### "డైలీ హెరాల్డ్" విలేఖరితో గాంధీజీ ప్రసంగం

లండన్, జులై 9: "డైలీ హెరాల్డ్" విలేఖరి గాంధీజీని సందర్శించి తన పత్రికకు ఇలా వ్రాశాడు:

"ప్రపంచ పరిస్థితినిగురించి గాంధీజీ నిరాశపడుతున్నాడు. పదేళ్లలోపల మళ్లీ యింకోయుద్ధం రావచ్చునని గాంధీ మహాత్ముడు భావిస్తున్నాడు."

ఆటంబాంబు సర్వనాశనం చేస్తుందనే భయాందోళనవల్ల ప్రపంచమిక అహింసనే అగత్యంగా అవలంబించవలసి వస్తుందని విలేఖరి సూచించగా, గాంధీజీ ఆ అభిప్రాయంతో ఏకీభవించలేదు.

"హింసాతత్వంగల మనుష్యుడికి ఎంత వినాశంచేసి, ఎంత మందిని చంపగలిగితే అంత ఆనందం కలుగుతుంది" అని గాంధీగారన్నారట.

అస్పృశ్యులు స్వతంత్రులయ్యేవరకు భారతదేశానికి వాస్తవమైన స్వాతంత్ర్యం ఉండదని, కూడా గాంధీమహాత్ముడు చెప్పాడుట. అయితే, అమెరికాలోని నీగ్రోలకుగాని, దక్షిణ తూర్పు ఆఫ్రికాలలోని ఆసియాజాతులవారికి వలెనూ, భారతదేశంలోని అస్పృశ్యులకు శాసనరీత్యా ఎటువంటి అన్యాయాలు కష్టాలు కల్పించబడలేదని గాంధీజీ వక్కాణించాడు.

## బొంబాయినుంచి నాయకుల నిష్క్రమణం

బొంబాయి, జూలై 9: రాష్ట్రపతి పండిట్ జవహర్లాల్ నెహ్రూ ఇవాళ ప్రొద్దున వోర్లీ హరిజన నివాసంవద్ద గాంధీ మహాత్ముణ్ణి సందర్శించి, మహాత్మునితో దాదాపు ఒక గంటసేపు ప్రసంగించాడు. వల్లభాయిపటేలు, గాంధీమహాత్ముణ్ణి మధ్యాహ్నం కలుసుకున్నాడు.

పండిట్ నెహ్రూ అలహాబాదుకు గురువారంనాడు బయలుదేర్తాడని తెలుస్తున్నది.

మౌలానా ఆజాద్ కలకత్తాకు రేపు బయలుదేరుతాడు.

## రాజ్యాంగ పరిషత్తు చట్టవిరుద్ధం
### డా॥ పి. యన్. బెనర్జీగారి విమర్శ

కలకత్తా, జూలై 9: కలకత్తాలోని ఇండియన్ అసోసియేషనుకు ప్రెసిడెంటుగానున్న ఇదివరలో ఢిల్లీఅసెంబ్లీ మెంబరుగానున్న అయిన డా॥ పి. యన్. బెనర్జీగారు రాజ్యాంగ పరిషత్తు చట్టవిరుద్ధమనియు, సశాస్త్రీయముగా చెల్లనేరదనియు బయలు చేయుచు ఇలా చెప్పారు:

ఇండియాలోని రాష్ట్రీయ శాసనసభలు బ్రిటిషు పార్లమెంటువలె స్వతంత్రమైన సభలు కావు. అది పార్లమెంటు శాసించి నట్టి ఇండియా ఆక్టుకు లోబడినవై యున్నవి.

కనుక, యీ రాజ్యాంగపరిషత్తుకు ప్రతినిధులను ఎన్నుకోవలసినదిగా రాష్ట్రీయ శాసన సభలకు అధికారము ఇండియా ఆక్టువల్లగాని పార్లమెంటువల్లగాని యివ్వబడవలెను. అలా యివ్వబడియుండలేదు గనుకను రాజ్యాంగపరిషత్తుకు ప్రతినిధులను ఎన్నుకోవలసినదిగా ఉత్తరువు చేయుటకు గవర్నరు జనరలుకు అధికారము లేదు గనుకను యీ ప్రతినిధులతో కూడిన రాజ్యాంగ పరిషత్తు శాసన సమ్మతమైనది కాదు. అదిన్నీగాక రాష్ట్రీయ శాసనసభల తరఫున ప్రతినిధులను ఎన్నుకొనుటలో శాసన సభ్యవర్గమును మత సంఘముల విభేదాను సారముగా రెండు భాగాలుగా విభజించుట ఇండియా ఆక్టునకు విరుద్ధం. ఈ రాష్ట్రీయ శాసనసభలు లేనిపు ఇండియా ఆక్టులో నిర్వచింపబడి యుండని పనులను నెరవేర్చుటకు వీలులేదు.









Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu Chetty Street, Madras.